# వెన్నముద్దలు



స్వామి సుందర చైతన్యానంద

# వెన్నముద్దలు

(చిన్నికృష్ణ శతకము)



స్వామి సుందర చైతన్యానంద



ఓం



# వెన్నముద్దలు

స్వామి సుందర చైతన్యానంద

వెన్నముద్దలు
ప్రథమ ముద్రణము ఆగష్టు 2005
కాపీలు 2000
(సర్వ స్వామ్యములు ట్రస్టువి)
ప్రచురణ : సద్గురు కల్చరల్ ట్రస్ట్, సుందర చైతన్యాశ్రమం,
హైదరాబాద్ - 500 043.
☎ : (08418) 255777, 255355

మీగడ

ఒడి కూలిపోవచ్చు
భాష పారిపోదు.

బావి పూడిపోవచ్చు
జలం లేకపోదు.

తరువులు కూలినా, తారలు రాలినా
మన్ను కరిగినా, మిన్ను విరిగినా - భాషే చెబుతుంది. భావం చెప్పిస్తుంది.

భావాలలో బాధలు ఉండవచ్చు. బాధలలో భావాలు పుట్టవచ్చు. అలా పుట్టినవి కవితలు అవుతాయి. పెరిగితే అవే కావ్యాలు అవుతాయి.

**నానృషిః కురుతే కావ్యం**

నిజమే. ఋషి కానివాడు కావ్యం వ్రాయలేడు. కవులు కాగితాలు మడత పెట్టేవారు కాకుండా క్రాంతదర్శులై ఉండాలి.

ముందు చూసి వ్రాయాలి
వెనుక తిరిగి వ్రాయాలి - అప్పుడే కవితలు కాలంలో కరిగి పోకుండా ఉంటాయి. ఎంత వాడుకున్నా అరిగి పోకుండా ఉంటాయి.

**ఇది వెన్నముద్దల పుస్తకం**

ఆలోచనల సంపుటి కాదు
అనుభవాల కుంపటి.

మరువరాని సుందర తీరాలకు ఛందోరహితంగా పయనమైన ఈ కవితా ప్రవాహంలో అందమైన భావతరంగాలు ఎన్నో ఉన్నాయి.

జలపాత సదృశంగా దూకిన భావరచన ఇది. భావజాలాన్ని, భావజలాన్ని అవలీలగా తోసుకుంటూ ముందుకు సాగిన భాషా స్రోతస్విని ఇది. నిన్న మొదలై నేడు తుది చూచిన రెండు రోజుల ఆట ఇది.

మూడు దశాబ్దాలుగా సాగిన బాటలో ఏరుకున్న అమూల్యమైన మణులలో పొదిగిన సుందర సుమహార మణిహార మిది.

మధుమాసపు మెడను అందముగా అలంకరించబోయే వాణీ సుమహార మిది.

బాధల నుండి నేర్చుకొనిన పాఠాలనే కవులు పద్యాలుగా అల్లుతారు అన్నాడు మహాకవి షెల్లీ. ఆ మాట సత్యం. ముమ్మాటికీ సత్యం.

కాని,
నేను తీసిన వెన్నముద్దలు అలాంటివే అయినా,
ఇలాంటివి అని చెప్పేందుకు వీలు లేని విధంగా ఉన్నాయి.

నాలో ఉన్నది వ్రాశానో - వ్రాస్తూ నాలో ఉన్నది చూశానో, బయట ఉన్నవారికి అర్థం కాదు. ఫరవాలేదు.

బాహ్యానికి అందించాలని సాగిన రచన కాదిది. అంతరంగంలో అంతర్యామి కొరకు పడిన వేదన; చేసిన నివేదన.

ఇదొక అందమైన వార్పు
అనుభవానందమైన కూర్పు.
నిట్టూర్పులు ఉంటాయి. ఓదార్పులు ఉంటాయి. ఓర్పుతో ఆలోచించాలి. నేర్పుతో అవలోకించాలి.

పాలలో నీళ్ళు కలిస్తే పాలు పలుచ బడతాయి. అవే పాలు కాగి కాగి, బాగా మరగి మీగడై మళ్ళీ ముద్ద కడతాయి. మధురంగా రుచికర మవుతాయి.

వాసుదేవుని వైభవ క్షేత్రంలో
నా వాత్సల్యం కలిస్తే
విషయం వెలుచ బడవచ్చు.

కాని,
నా వేదనా వేడిలో
వేదనా వాడిలో

కాని కాని, బాగా మరగి
భావ మీగడ పుట్టవచ్చు
చిలుకరిస్తే అది పరిపాకించవచ్చు. అదే జరిగింది.
ఈ వెన్నముద్దలన్నీ అవే.
కృష్ణుడికి వెన్న ఇష్టం
అంతకన్నా మన్ను ఇష్టం.
జ్ఞానమనే నవనీతాన్ని, మన్ను అనే మహిలో విరివిగా వితరణ చేయాలి అనేది వాసుదేవుని అభీష్టం. అలా చేసినదే గీతా నవనీతం. భగవద్గీతామృతం.



వచ్చేది కృష్ణుడు పుట్టిన రోజు
భక్తులనే కలువలను వికసింప చేసే
బృందావన రజనీశుడు పుట్టిన రోజు.

మాటలనే ముద్దలు చేసి, వెన్నముద్దలు చేసి,
ముద్దు ముద్దుగా బాలకృష్ణమ్మకు పెట్టాలని,
పెడుతూ పెడుతూ చూడాలని
చూస్తూ చూస్తూ పెట్టాలని
చేసిన నిర్వాకమే ఈ వెన్నముద్దలు.

సమర్పించాను నైవేద్యం
వితరణ కావాలి ప్రసాదం.
భక్తులందరూ అందుకోండి ప్రసాదం. వెన్నముద్దల ప్రసాదం.

చదివే వారికి పుస్తకం
వినేవారికి ఆడియో క్యాసెట్లు, ఆడియో సి.డిలలో పుస్తకం
చూచేవారికి వీడియో సి.డి.లతో పుస్తకం
అన్నీ అందించగలిగా మని ఆనందిస్తున్నాం.



స్వామి సుందర చైతన్యానంద



సద్గురు మహర్షి శ్రీ శుద్ధానందజీతో శ్రీ స్వామీజీ

1

బ్రతుకు నిచ్చిన నీ దివ్య భావ మెరిగి
మనసులో రాగాల జల్లు కురిసి
పలికెదను నోరార లోలోన తేనెలూరి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!







**2**

కలము లోన నా గుండె గళము లోన
మాట లోన నీదైన పాట లోన
మరువలేను క్షణమైన మనసు లోన
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**3**

సిద్ధమైనది నా లోన పూలతేరు
జాగు సేయక వేగమే వచ్చి చేరు
ఊరు తిప్పెదను ఊపిరున్నంత వరకు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**4**

ముద్దు పాపగ నువ్వు పలికిన సుద్దులన్నీ
ఘనమైన భాషలో మునులు వ్రాసినారు
బాల భాష మెచ్చినావా బాలకృష్ణా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**5**

ఎంత సుఖమున్నదో నీ పేరులోన
మధురమైన రుచి ఉంది నీ ప్రేమలోన
మరువలేరు అందుకే నిన్ను ఎవ్వరైన
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



6

తిరిగి తిరిగి పక్షులు తరువు చేరు
పారి వచ్చిన జలములే చెరువు నీరు
నిన్ను చేరిన వారికే కరువు తీరు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



7

తపము లెన్నో చేసిన తాపసులకు
యోగి వరులకు దక్కని ప్రభువు నీవు
గొల్ల ఇండ్ల ముందు కాపు ఎందుకయ్యా?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



8

వెన్నపూస వంటి మనసున్న స్వామి
వెంట పడితి నని మనసులో విసిగిపోకు
ఉన్నవాడివి నాకు నీవె గాదా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



9

మాట రాదు నాకు నీ పాట రాదు
ఆట కరువైన వారికి బ్రతుకు చేదు
తీపి తినిపించితివి చేదు లేదు యనుచు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



10

పొన్నచెట్టు పున్నెము ఏమి చెబుదు
రాల్చి పువ్వులు నిన్ను పూజ చేసె
తరువు పోసిన పువ్వులు నీ తనువు చేరె
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





11

కారుతున్నాయి విరివిగా కంటినీరు
ముసురుతున్నాయి బాధలు ఎటుల తీరు?
నారు పోసిన నీవే పోయాలి నీరు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





12

వెన్న లెందుకు వెన్నుడవు నీవు కావా!
మన్ను లెందుకు మహిమలు నీకు లేవా!
మమ్ము కడదేర్చుటకు ఎన్ని కళలు నీకు?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





13

గూడు బాగుంది గుట్టుగా గువ్వ ఉంది
తోడు రమ్మని మరి మరీ పలుకుతోంది
గూడు చెడక ముందే జోడుగా ఉందు స్వామీ
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**14**

ఏటిలో సెలయేటి నీటిలోన
తోటలో పూదోట విరుల లోన
నిన్నె గాంతును కోకిలమ్మ పాటలోన
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**15**

ఏనాటి పాపమో నీకు దూరమైతి
ఎవరు పెట్టిన శాపమో తిరిగి చేరనైతి
నీవు వెలిగించు దీపమే దిక్కు నాకు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**16**

నీవు ఆడించిన తీరు ఆడినాను
మనసు పెట్టి మహిమను మాట్లాడినాను
అలక కారణమేమి అది యైన చెప్పు స్వామి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**17**

కలదు కల దనెడి వారిలో కలవు నీవు
లేడు లే దనెడి వారిలో నిజము నీవు
ఉండి లేనట్లు ఉంటివి ఉర్వినాథా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





18

మనసులో మాట నోరార చెప్పినాను
అడుగులో అడుగేసి అడిగినాను
మారు పలకకున్న ఇక నేను బ్రతకలేను
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



19

పాలు పట్టెద మనిన గోపాలు డాయె
విందు ఇచ్చెద మనిన గోవిందు డాయె
ఇచ్చుటకు ఏముంది నా పిచ్చి గాని
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



20

గట్టి గుండెను కొండలో దించినావు
చల్లనైన మనసును మబ్బుకు ఇచ్చినావు
నవ్వు ఏమిటో పువ్వుకు నేర్పినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



21

ఎంత కందినదో కరము కొండ మోసి
ఎంత నలిగినదో కరపద్మము బండి లాగి
కాపడము పెట్టెద కరము నందించు తండ్రీ!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



22

కట్టినారు కొందరు కొట్టినారు
పట్టినారు కొందరు పెట్టినారు
అందరిని సమముగా చూచినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



23

ఏమి తక్కువ నీకు కమలనయన!
చోద్య మెందుకు స్వామి జలధిశయన!
చోరుడను బిరుదును పొందవలెనా?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



24

మన్ను తింటివని నోరు చూప మనగా
తెరచి చూపితివట నోట త్రిభువనములు
మా కళ్ళకు ఆ భాగ్య మెపుడు కలుగు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



25

నీవు పుట్టిన దెక్కడో తెలియదయ్య
పెరుగుతున్నావు నా లోన పుణ్యపురుషా
పట్టలేక నిన్ను నా గుండెలో పెట్టుకొంటి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!




26
కల్లలాడితివి చల్లను దోచి దోచి
కనికరించితివి ఉల్లములు చల్ల చేసి
మెల్లగా ఉందును చల్లగా నన్ను చూడవేమి?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!


27
వనము లోన మగువల మనములోన
యమునలోన నా గుండె లోతు లోన
దాగి ఉందువు గాని దగా సేయకయ్యా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!


28
మన్ను ఎంత రుచియో తిన్న నీకు తెలుసు
వెన్నలో ఏమున్నదో ఎవరి కెరుక
లేని వారికి నీ వెలా ఉందువయ్యా?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!


29
మేలుకున్నాను నీ కొరకు మేలు తెలిసి
పలుకున్నావు బ్రతుకును యెదను కదిపి
నీది కావాలి తుదిశ్వాస నీరజాక్ష!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!

30

చీర లెందుకు నీకు చిన్నికృష్ణా!
చిత్తమే నీకు నిజమైన విత్తమయ్యా!
మర్మమెరిగిన వారికే ముక్తికాంత
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





31

మురళి నూదుతు మారు పలుక కున్న
మూగవాడని జనులందరు చెప్పుకోరా?
మాటలాడుము ముత్యాలు రాలిపోవు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





32

ఏమి లేని వాడినని మదిలో ఎంచకయ్యా!
ఎవరు లేని వాడినని ప్రక్కన ఉంచకయ్యా!
ఏమి లేదనే కదా వేణువును చేబూనినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!




33

పయన మైతిని పుడమిని పంచె కట్టి
నెలరాజు కిరణాలు కళ్ళెముగ బూని
గాలిబండి నెక్కి గబగబ నిన్ను చేరి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





34

కట్టి బంధించుటకు భామ సిద్ధమాయె
కట్ట లేనని త్రాడు మొండి కేసె
జడము కున్న ప్రేమ జవ్వానికి లేక పోయె
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



35

మధుర మంజుల మోహన రూపవంతా!
కీర్తించినది నీ అందము చరాచర లోకమంతా
సృష్టి కుందను తిప్పెదను దిష్టి తగలకుండా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



36

అలల వోలె నే గన్న కలల వోలె
కరిగి పోయాయి కల్పిత బంధనాలు
నా కంటి పాపగా నిలిచినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



37

వెతక వలదు బయట వెలుగు లేదు
అంతరంగాన ఉన్నదని నిత్యకాంతి
వటపత్ర శాయివై దారి తెలిపినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



38

ఏమి లేని నాకు ఉన్నదొకటి
ఎవరి కివ్వక నీ కొరకె దాచిపెడితి
హృదయమే అది-మధ్యలో దయవు నీవు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



39

మనసుతో కట్టి తెచ్చాను మల్లెదండ
ముందే వేసినారు ఎవ్వరో మందార మాల
ఏమి చేయగలను మాలను పాదాల వద్ద నుంచి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



40

నీ మురళి రవళిలో ముజ్జగములు
రసరమ్యకేళిలో మునులు సురులు
పులకించి పోయిరి పరవశించి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



41

సనకాదు లెరుగని నీ దివ్యమహిమ
సామాన్యుడను నే నెన్న తరమా?
మురిసి పలికెద మనసార తనివి తీరా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



42

ప్రాణ మెందుకు నీ నామ గానముండ
ధనము లెందుకు నీ చరణ ధ్యానముండ
ధరణీ ఎందుకు నీవె నా గుండె నిండా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





43

చెలిమి ఎందుకు జగతియే కొలిమి కాగా
కలిమి ఎందుకు నీవే మా బలిమి కావా
కనికరంబును చూపి మమ్ము ఆదుకోవా?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





44

నిన్ను చూసుకొని జీవించినాను నేను
నీ చూపు కరువైన మరణించగలను
నమ్మినోళ్ళకే కదా నామాలు ఎన్నడైనా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





45

యమున గట్టున వేణు నాదమును సేయ
శీత ఆతపములు నిన్ను ఆవరించె
ఏమి పుణ్యమొ తరువులు గొడుగు లాయె
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





46

తిమిరాలు ముసిరినా వెలుగులు విరిసినా
సుడిగాలి వీచినా సుమవాన కురిసినా
ఉంటాను పాడుతూ ప్రాణ మున్నంత దాకా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





47

మాట లున్నంత వరకు మౌని కాలేను నేను
పాట వినిపించుటకు నేను వెనుకాడలేను
వాటి నడుమ నిను మరువనీయ కయ్యా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





48

ఉంది వెన్నెల మనసులో నల్లనయ్య
యమున పారింది యెదలోన చల్లనయ్య
ఏమి లేదని నను వీడిపోతి వయ్య
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





49

ఏమి తెలుసని నేను పలుకగలను
వ్రాయుటకు లేదు శక్తి పాడుటకును
కరము చేబూని నడిపితివి కనికరించి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





50

కృష్ణ యను పలుకులో ఎంత కమ్మదనము!
బాధలలో ఓదార్చు అమ్మతనము
నిన్ను మించిన దైవమును కనలేము మేము
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



51

దాచలేదు జ్ఞానము దాచుకోలేను ధనము
దాచ బూనిన వారిని దాటి వచ్చినాను
నేను దాచినది నిన్నే కదా చిన్నిదొంగ!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



52

తోడు లేని వారికి తోడు నీవు
అందరు నీ బిడ్డలే మము గన్న తండ్రి నీవే
కనికరించి మమ్ము కాపాడు తండ్రీ!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



53

మొగము దాచెదరు దొంగలు చూపలేక
ధనము చూపరు ధనికులు బెంగచేత
ధనము సతిల్లైన దొంగ నెటు చూడగలము?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**54**

బిడ్డలు లేరని ఒక భామ మనవి చేయ
నేను మగడైన కలిగెదరు బిడ్డ లనుచు
పైకి ఉరికితి వట ఆ పడతి పుణ్యమేమి?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**55**

గోవు లందును గోపికా తరుణు లందు
తరువు లందును మరు లొలుకు విరుల యందు
సర్వమందును సారమై ఉందువయ్యా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**56**

ఘల్లు ఘల్లున అందెలు మ్రోగుచుండ
చెంగు చెంగున దూడలు ఎగురు చుండ
మురళి నూదితి వట విశ్వమోహనముగ
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**57**

బాలభానుడు నా నొసట బొట్టు కాగా
వాయుదేవుడు నాలోన శ్వాస కాగా
ఉరుమునై పలికెద నీ కీర్తి విశ్వమంతా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



58

ఆర్జన తెలియదు అర్చనే ఊపిరాయె
నామ గర్జనే ఏకైక దిక్కు ఆయె
వినుము నా గోల ఇనుమును గాను నేను
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



59

కట్టుటకు త్రాటితో నేను అమ్మ గాను
త్రాడు కట్టించుకొనలేదు నిన్ను అమ్మలేను
ఉట్టి కెక్కలేని నీ కన్నబిడ్డ నేను
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



60

కొండ మోసిన నీవు నా తోడు ఉండ
బ్రతుకు పండగ పలికితిని నా నోరు నిండ
కులికినది చాలని నేడు పలుకకుంటి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



61

ఉనికి లేనిది జగతి ఉన్నగాని
పనికి రానిది సంగతి నీది గాని
పూల కవిత లల్లెద నీ పదాల నీడలోన
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



62

నవ్వి నవ్వించితిని నాడు నీ మాయ తెలిపి
నవ్వు పారేసుకున్నాను నేడు నీ మహిమ తెలిసి
నవ్వులాటలు ఇక నేను ఆడలేను
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





63

నిన్ను పిలుచుట నాకు నియమ మాయె
పిలిచినపుడల్లా రాబోకు చిన్నితండ్రీ
పరిహాసించువారు నీ విలువ తెలియలేరు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





64

వయసు రాని నాడు ఊహవై వచ్చినావు
వయసు రాగానే ఊపిరై నిలిచినావు
ఊపి రున్నంత వరకు నిన్ను నే నెట్లు మరతు?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





65

ఏడు రోజులు వారాని కెందుకయ్యా?
ఏడుపే గల వారమని మమ్ము నిందించనేల?
వారమంతా కాపాడు వాసుదేవా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





66

ఆత్మబంధువు లని నోరార పిలిచి పలుక
కాన రెవ్వరు మనసుకు ఆన రెవరు
ఆత్మయే ఆత్మకు నిజమైన బంధువయ్యా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



67

మార్చు నాశించి పలికాను మారు ప్రోగ
మార్చు సాధ్యము కాదని నేను మారిపోతి
అంధులు మారలేరు అంధుని కొడుకు రీతి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



68

అందవు గాన నిన్ను అందరు పొంద లేరు
విందు రందరు నీ వింతలు విందు గాను
ఆనంద మైతివి అందరికీ అందముగను
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



69

పేరు కొరకు కొందరు సేవ కొరకు
వచించి రచించి ప్రవచించినారు
నా పాట మాట రచనలు పరము కొరకే
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



70

అల్లరెందుకు నీకు నల్లనయ్య
మగువల వలపు లెందుకు మాయలయ్య
కావు ఆటలు అవి ఆటకట్టు లయ్య
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



71

నిన్ను విడిచి క్షణమైన ఉండలేను
బ్రతుకు దిగులాయె దినమె ఒక యుగము కాగా
మూత పడక ముందె ఊతగా నిలువు స్వామీ
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



72

ఆడించకు ఇక నేను ఆడలేను
ఆట లాడించకు నీ కది పాడిగాదు
దేవుడివి నీవు గారడి చేయకయ్యా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



73

మార్చలేకపోయాయి నేర్చిన విద్యలన్నీ
మార్చి చూపాయి ఓర్చిన బాధలన్నీ
తీర్చి ఉంచాయి మనసును వెన్న లాగా
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**74**

ఎవరు నీ వారు? యమున ఎవరి నీరు?
పోరు నడుమ నిలిచినది ఎవరి తేరు?
బ్రతుకు మారు నీ బోధతో బాధ తీరు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**75**

మన్నులో మన్నుగా మిగిలినాను
గాలిలో గాలినై తిరిగినాను
నిప్పుగానే నేను నిలిచినాను
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**76**

కలల మత్తులో ఉలికి పడితి వేల?
ఎవరు పిలిచారు కల లోన తొంగిచూచి
కల కాలము కూడ భక్తుల మెలకు వేనా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**77**

శ్యామ శ్యామ యని కదలిన బ్రతుకుబండి
రామ రామ - కర్మసుడిలోన చిక్కుకొనియె
రాత్రి పగలు తెలియక అలసిపోతి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



78

విశ్వరచన చేసి విరించి బ్రహ్మ కాగా
విపుల రచన చేసి జ్ఞానబ్రహ్మ నైతి
బిచ్చగానికి బిరుదులా లచ్చి విభుడా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





79

ఎంత కాలము ఎదురు చూడగలను?
యెదను చాప చేసి పరచినాను
ఇల్లు చేరు స్వామి చీకటి పడక ముందే
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





80

ఆశతో కదిలాను శ్వాస నీవు కాగా
శ్వాస మిగిలింది ఆశ ఎటో పారిపోయె
శ్వాసలాగు వరకు నీ సేవ ఆపనయ్యా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





81

కలువ పువ్వుకు చెలువము అలదినావు
నెమలి పక్షికి నాట్యము నేర్పినావు
చెలిమినే నిజ కలిమిగా చూపినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**82**

కననీర కరుణాకర కమలనాథ!
కాన రార గాంచెదను నా తనివి తీర
చేర్చుకోర నన్ను నీ మనము లోన
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**83**

కాళీయుని శిరముపై చిందు లేసి
తాండవ మాడితివి బ్రహ్మాండ ముదర
పదగ ధన్యమైనది నీ అడుగు పడగ
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**84**

మాయ లెరుగని మల్లె మనసు నాది
కపట మెరుగని కన్నుల కాంతి నాది
చల్లి మల్లెలు అర్చింతు కాంతి లోన
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**85**

ఎవరు నీవు? ఎవ్వరూ ఎరుగలేరు
ఎరిగినవారు తిరిగి ఎరుక పరచలేరు
ఎదను చేరి సొదలన్నీ విందువయ్యా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



86

కాచినవి కాయలు చేతులు రాసి రాసి
అరిగిపోయినవి పాదాలు తిరిగి తిరిగి వాచి
మూగబోయినవి మాటలు కళ్ళార నిన్ను చూచి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



87

నిన్ను అలదిన మన్నుకు పున్నె మెంతో
మన్ను తొలగించి తను చేరె సున్నిపిండి
మన్ను కాలేని నేను సున్నిపిండి గాను
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



88

చిలిపి చిలిపి పనుల చక్కనయ్య
బ్రహ్మ రుద్రాదుల కైన నీవు చిక్కవయ్య
తలచి వలచిన వారికే దక్కినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



89

రోజు ప్రతిరోజు కీర్తించు నామమైనా
ఏ రోజు కారోజు కొత్త రుచిని పంచు
నామ మేదో కాదు నీ దివ్య ధామమేలే
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**90**

కపట మెరుగవు కల్లలు లేవు నీలో
కళ్ళు తెరిపించుటే నీ కళల తీరు
మాటకారివి మాయలు చేయకయ్యా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**91**

ఎత్తుకొనిన యువతుల పుణ్య మెంతో?
ఎత్తుకొని ఎగిరిన అసురుని పాప మెంతో?
గాలి రాక్షసుని కూల్చావు జాలి లేక
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**92**

కులము వ్యాకుల మని తలచి బైటపడితి
నీవె అనుకూల మని మదిలో పొంగిపోతి
మారు పలుకవు నేనెలా తాళగలను?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





**93**

కల్ల లాడినావు అల్లరి చేసినావు
నమ్మినోళ్ళకి దేవుడై వెలసినావు
దయయే ఊపిరిగా జీవించినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!





92

కులము వ్యాకుల మని తలచి బైటపడితి
నీవె అనుకూల మని మదిలో పొంగిపోతి
మారు పలుకవు నేనెలా తాళగలను?
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!







93

కల్ల లాడినావు అల్లరి చేసినావు
నమ్మినోళ్ళకి దేవుడై వెలసినావు
దయయే ఊపిరిగా జీవించినావు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!







94

వెదురు కూనను మురళిగా మార్చినావు
ఊది ఊపిరి జగతిని మురిపించినావు
ఊదుతున్నావు ఊపిరి మురళిగా నన్ను మార్చవేమి
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!







95

ఉరమును శ్రీదేవి ఆశ్రయించె
శశిసూర్యులు కళ్ళలో కదలుచుండె
నాభి కమలమున బ్రహ్మ చేరిపోయె
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!







**96**

కళ్ళు తెరచినపు డెల్ల కాంతులు కానరావు
కళ్ళు మూసిన క్షణాన చీకట్లు లేకపోవు
కళ్ళు మూసికొందును సదా ఉన్న దాని కొరకు
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**97**

పెద్దల మార్గాన నడుస్తు నయ్యా!
చిన్నబుద్ధులు పూర్తిగా విడుతు నయ్యా!
నోరార నిన్ను నేను పిలుతు నయ్యా!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**98**

సుందరమైన నా మనసు వెన్న
ముద్దలైనవి చైతన్య బుద్ధి యందు
ఆనందముగ ఆరగించు స్వామీ!
నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!



**99**

వెన్నె లొచ్చింది రావోయి చిన్నిదొంగ!
ముద్దుముద్దుగా వెన్నముద్ద లివిగో
వద్దు వద్దనక బుద్ధిగా ఆరగించు
సద్దు సేయక దర్శింతు ముద్దుకృష్ణా!



100

ఏలిన స్వామి నీకు లాలి లాలి
వీచె మనసు గాలి లోని లాలి
జాలి చూపు ఓ వనమాలి లాలి
రాలిపోయెదను నీ చరణాల వాలి

సర్వం శ్రీ కృష్ణార్పణ మస్తు

సర్వేజనాః సుఖినో భవన్తు

# Vennamuddalu video&audio links

- http://www.4shared.com/dir/8980379/c56eed7/VENNAMUDDALAU-2_PRAVACHANAMbyS.html
- http://www.youtube.com/results?search_query=vennamuddalu&search_type=&aq=f
- http://gitamakarandam.blogspot.com/
- http://telugudevotionalswaranjali.blogspot.com/
- Mail: ysreddy94hyd@gmail.com